# చైతన్య స్రవంతి

కవితా సంగ్రహం



రావెళ్ళ
వెంకటరామారావు

నవ ప్రచురణలు
గోకినేపల్లి 507 158



పెంజీకటి పెకలించి వెలుగులు ప్రసరించే మానవతా నవమందిర నిర్మాణానికి తగిన ఉత్సాహ ప్రోత్సాహాలందించడమే చైతన్య స్రవంతి ప్రధానోద్దేశ్యం శుభకామనలు జగతి పురుచిస్తూ ప్రగతిని ఉపలక్షించి తదభిముఖంగా జనమనములను తీర్చిదిద్దడమే పరమలక్ష్యం

ప్రకృతి అందచందాలు అమూల్యసంపదలు సార్వజనీనం కావాలనడంలో ఎలాంటి విప్రతిపత్తికి తావులేదు సామాజికపరం కాలేదు గనుక ప్రకృతి ప్రయోజనరహిత మనే నైరాశ్యమే కూడనిది ప్రకృతిగాన సందేశాన్ని ప్రతి మనిషికీ వినిపించి వారిలో నిద్రాణమైయున్న శక్తియుక్తులను జాగృత పరచడమే చైతన్య స్రవంతి ధ్యేయం

ఈ ధ్యేయానికి అద్దంపట్టగల భావనాపటిమ భాషాశక్తి రెండూ నాలో లేవు అయినా గుండెలోతుల్లో గుబులొత్తుతున్న అనుభవాలు అప్పుడప్పుడు బయల్పడి అక్షరరూపం దాల్చుతూనే వుంటాయి వాటి ప్రతిరూపమే యీ చైతన్య స్రవంతి

ఈ చైతన్య స్రవంతిలోని శివుడు లోకానికి దూరంగా మంచుమలసానువుల్లో ఉభయసంధ్యల తాండవ ఖేలనామాత్రుడే కాదు మంచికి ప్రతిరూపంగా మానవుల మనస్సుల్లో ప్రకాశిస్తున్నవాడు చెడ్డనుచూచి కినిసి తన చిచ్చుకంటి నిప్పులెగజిమ్మ పటిమగలవాడు వాడిగురించే యీ తపన



మతం కులం బలం ధనం రాజకీయం
సాహిత్యం అన్నీ మానవునిలో మహాదేవుని ప్రతిష్ఠించే
సాధనాలు కావాలి కానినాడు వాటి ఉనికికి అర్థమేది
ఆ మహాయత్నానికి ఏమాత్రమైనా సహాయపడగలిగితే
చైతన్య స్రవంతి ఆశయం ఫలించినట్లే

ఈ సంపుటిలోని కవితలు ఆంధ్రప్రభ ఆంధ్రపత్రిక ప్రగతి విశాలాంధ్ర పత్రికలు ఆలిండియా రేడియో వివిధ కేంద్రముల ద్వారా పరిచయమైనవే ఆయా పత్రికాధిపతులకు రేడియో కేంద్రమువారికి కృతజ్ఞతాభివందనములు

వివిధ విషయాలపైన వెలువరించు సమయాలలో వ్రాయబడిన ఈ చైతన్య స్రవంతిలోని ఖండికలను ఏదీ కావాలని మార్చలేదు భావప్రవాహాన్ననుసరించి కొన్నింటి కూర్పు జరిగింది ప్రతిపద్యాలు మాత్రం కాలక్రమాన్ననుసరించి పేర్చబడినవి

తమ రాష్ట్రీయ గీతావళిలో ప్రథమస్థానమిచ్చి గౌరవించిన జాగృతి పత్రికాధిపతులకు అఖిలాంధ్ర పోటీల్లో ప్రథమబహుమతి నందజేసిన కెనాడ గురునాథ ఘోష్ వారికి ప్రత్యేకాభివందనములు

ఈ పుస్తకం వెలుగు చూడగలందులకు ఆర్థికంగా సహకరించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారికి గౌరవనీయ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి ఇండియన్ బ్యాంక్ ఖమ్మం బ్రాంచి మేనేజరు సాహితీ బంధువులు శ్రీ పై ప్రభాకరరావుగారికి వినయాంజలి

ఖమ్మం మండలం నుండి ఎగసి కవితాగగన వీధుల్లో
మహోజ్జ్వలంగా ప్రకాశిస్తున్న ఆంధ్రప్రదేశ్ ఆస్థాన
కవివరేణ్యులు ఆత్మీయులు డా॥ దాశరథిగారికి



ఖమ్మం జిల్లా రచయితల సంఘాధ్యక్షులు సాహిత్య
అకాడమీ సభ్యులు సహచరులు
శ్రీ కొలిపాక మధుసూదనరావుగారికి

బహుముఖ ప్రజ్ఞావంతులు శ్రీ కవిరాజమూర్తిగారికి



సుప్రసిద్ధ రచయితలు హితైషులు
శ్రీ హీరాలాల్ మోరియాగారికి



మృదుమధుర హృదయులు
డా॥ రామకృష్ణ రాయణంగారికి



స్వాతంత్ర్య సమరయోధులు శ్రేయోభిలాషులు
శ్రీ పొడపాటి నారాయణగారికి



సాహిత్యభూషణ శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లుగారికి

విమర్శకులు రచయితలు మిత్రులు
శ్రీ కౌముదిగారికి



ఖమ్మం జిల్లా సహకార శాఖాధికారులు ఉభాల్వనా
ప్రయవాపకులు కవిమిత్రులు శ్రీ మహమ్మదలిగారికి

ప్రఖ్యాత నవలా రచయితలు
శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావుగారికి

అ

# ముక్తగీతి

మానవ మంగళ విధాన
మామక కవితా నిధాన
జాగృతావనీ కారణ
మహాతాశయ పరిపూరణ

నవభారత జననీ !
నమో దివ్యధరణీ !

చలిత తటిచ్ఛలాంచల
ఫలితపూర్ణ భావాంచల
కలిత కనక కుసుమాంచల
లలిత లలిత నాట్యాంచల

నవభారత జననీ !
నమో దివ్యధరణీ

ప్రకళా శిల్పాగ్రణీ
గాయకజన నాయకమణీ
భ్రుకుటీనట కుపితారుణ
చ్ఛటోజ్జ్వలిత పటుధారిణీ

నవభారత జననీ
నమో దివ్యధరణీ !

అఖిల సమీరతాపహరణ
నిఖిల భువనశాంతివరణ
జీవచలన హేతుకరణ
సర్వప్రజారాగభరణ

నవభారత జనని
నమో దివ్యధరణీ

వేదవిహిత సామగాన
ధ్వనితగీత మధురపాన
సుధాస్రావ నిహితదాన
పుణ్యశిఖాదీప్తమాన

నవభారత జనని
నమో దివ్యధరణీ

# శివసుందరాకార!

ఆదిభిక్షువు శంఖ
మూది పలికె వేళ

ప్రథమ గణతాండవము
ప్రారంభము వేళ

డమరుకస్వామి పద
గమనోద్ధతుల వేళ

ఝణఝణాస్వాదముల
శ్రావ్యమొప్పు వేళ

భృంగీశరాడిం డిమ్ము
ఝంకరణసము వేళ

ధిమిధిమిద్ధిమిఝుటల
దిక్కులదరెడి వేళ

ఒడిసెశ్వరదీర్ఘ
జటయునర్తిలు వేళ

శిరముపై సురగంగ
తరంగలూగెడి వేళ

గిలగలల లయతాళ
గతులుబల్కెడి వేళ

నగరోప జాబిల్లి
సొగసుచిందెడి వేళ

శూలిగళమున ఫణులు
సొక్కియాడెడి వేళ
ఫాలలోచనుకర క
పాలనటనము వేళ
గిరికుహర తరులొకట
మురువుచూపిన వేళ
నటరాట్టు ఆనంద
రసరాట్టు అగు వేళ
కల్పనాన్విత కళా
శిల్పములు దొరవెనట



దక్షాధ్వరధ్వంస
అక్షివిప్పిన వేళ
నిటలాక్ష ప్రకటాగ్ని
చ్ఛటలుపెచిలిన వేళ
రుద్రభీమాటోప
రౌద్రముబికిన వేళ
శివశక్తి ఘూర్ణిల్లి
రవలువిమ్మిన వేళ
ఫణిభూషణుని మనో
గుణముచెదరిన వేళ
ధూర్జటి జ్వలితాన
నోరితుందగు వేళ

సంహారుడు మదిగనలి
సంహారుడగు వేళ
మాహేశ్వరుం డలిగి
మరుని గూల్చిన వేళ
ఖట్వాంగధరుఁ డరిఁ
ఖండముడించెడి వేళ
కాలభైరవప్రళయ
గానము మొరసెనట।



ఆర్య అభినయముద్ర
లంది నిలిచిన వేళ
శైలజ కళావిభవ
సందీప్తయగు వేళ
పంచమ భృంగంపలము
మించి వెలిగెడి వేళ
కలకంఠి కమనీయ
గానమొలికెడి వేళ
తనుమధ్య మాకంద
తావలోకన వేళ
మొలనూలు గజ్జియల
కలరుతము విను వేళ
హైమవతీ నూపు
రారవ శ్రుతి వేళ

## చైతన్య ప్రవ

లలితపద విన్యాస
విలసనము గను వేళ
గిరికన్య లాస్యాన
హరుని గొల్చిన వేళ
బాలేందు ధరుడు నగ
బాలవరుడగు వేళ
ధనాధు ప్రియసఖుడు
జయశాధువగు వేళ
పర్వతేశుని తనయి
పాణిగ్రహణ వేళ
చెక్కిటను యింద్రాణి
చుక్కదాల్చిన వేళ
శార్వాణి చరణముల
పారాణిపగు వేళ
సర్వమంగళ శివుని
సామేనుయగు వేళ
గిరిరాజుపై భవుడు
సుమనుతుడగు వేళ
లోలాక్షి కనుసన్న
లోజిక్కుకొను వేళ
కపగూడి దంపతులు
కలయపండెడి వేళ
మధుర భావావేశ
సుధలునిండిన వేళ

శృంగారపేల వే
భంగిమల విరిసెనట



కాలకాయుడు విషము
గ్రోలి నిలిచిన వేళ
మవర్తికై మోడ్చి
కళ్ళు గొల్చిన వే
ార్వతీ ందభయ
పాలకుం గు వే
హా దేవుడు భక్త
మం దా గు వె
ృషభాధిపు ాధు
హృదివసించెడు వేళ
పాపపతమును బొద్దు
పరముజేసిన వేళ
శ్రీ ండరుడార్తి జన
శ్రీకరుం గు వేళ
జగతిలో నవప్రగతి
జనియించుచుండెనట !



ఆనాటి శివలీల
లవని గనుపింపవే ?

# రుద్రాభిషేకం

పటుతర భ్రూకుటీ
ని ంలోగ్ర సంభూం
ుఎతారుణచ్ఛటా
గుంఫిత జ్వలితాగ్ని
కొలా ాలాభీల

క్రోధభైరవమూర్తి !
కంఠ మాలాంంప
కాపాల ముఝ్మరా
చండ చంటోద్ఘోష
భండ నార్భటఘామి
రోమోద్గ మాంచిత
రోష భీషణ స్ఫూర్తి !

ఫణిఫణోద్ధగధగిత
భయద దంష్ట్రామూల
రుధిర ధారాపూర
రుద్రగణ పరివేష్టి !
గళగరళ నిక్షిప్త
కాల భీమాకారం !

ఉగ్ర భావోన్మత్త
ఉన్మీల నాసాగ్ర
దురిత కిల్బిషగ్రీవ
పరిహార మాహోగ్ర
ఛిద్రఛిద్ర చ్ఛేద
ముద్రావలంబకా

పెయుంముమ్మన శక్తి
ఎక్కుచిల్లగ రమ్ము
అన్యాయ పటలముల
నాహుతిన్ గొనిపొమ్ము
అరివర్గ శీర్షోద్గ
మోత్తాలంకృరభ
జయ జయ మన్నిలింప
జయ గౌరి పర్యంక

జయ జయ మహాదేవ
జయలోక సంచాల
జయ జయ మహాశూల
జయ భద్రకాళా!

27–2–1965

# సంవర్తనచ్ఛాటు

ఏది జ్వాలాభీల తూలిం
ప్రళయనెత్రుని ద కీలిక
కాలభైరవ భయదచాలిత
ఎలయికాలధ్వనిత ఘోషము
చండభాను ప్రచండధూమం
కలుష కంరవిఘుంర చండిక
ఏది ఏదీ

దగ్ధఖాండవ దహాసయామం
తుంగజలధి తరంగ గీతం
ఝర్ఝరీకృత ఘోషకలనా
జాయమాన మహోగ్రపాతం
భీమ వాతోద్ధూత సంభవ
భిదురఘాత విహారవ్రాతం
ఏది ఏదీ

జగతిదానవస్వార్థశక్తుల
నగ్న తాండవ నృత్యకేళుల
రుధిరదాహప్రలోభయుక్తత
వదలజేయు కరాళకాహళ
ధ్వానమున కెరలెత్తి పొంగిన
దళితజాతి విముక్తవాహిని
ఏది ఏదీ

# నా స్వామి

నింగిని నీలిమమ్రింగి చల్లని
పాల వెన్నెలలీను జాబిలి
పూలసౌరులు పుణికికొని నా
ఎదను నింపితివోయి స్వామి

నిండుపున్నమ వెనిగ్గొని
నింగినంటగ పొంగులెత్తే
పాలకడలిని పసదనమ్ముల
కన్నులారగ గంటిస్వామి ।

ఒక్కడా యరవిందమిత్రుడు
చెక్కిలంటగ చేరనకను
అంతకంతకు అరిగి క్రోధ ని
దాఘ తీవ్రత దాల్చె స్వామి

మధురమంజుల సుధాపేశల
కథలతో నాహృదయమందున
రాగ జలనిధులావహింపగ
హేతువవని ఎంతుస్వామి

15—5—1936

# ఉగ్రయాగం

ఏయ్ రుద్రా
కాల నేత్రోజ్వలిత రుద్ధా!
ఏయ్ రుద్రా

ప్రళయ శంఖారావ భీకర
ఫాలనేత్ర కపాలికాధర!
పటహడమరుక భయదసంచయ
భుజగమండిత భూరిశూలా!

ధరణిమారక సురద్విషకృత
అణురణోద్గత వ్రణభిషగ్వర
దుర్ఘనోద్ధత బర్బరీకృత
—శవికహత్మపాదముద్రా!

క్షుద్రమానవ రౌద్రవిస్తృత
కర్దమాతప కాలకంధర
శోకదుర్భర మూకబాధిత
లోకభద్రపినాక పాణీ!

# చైత్ర ప్రశాంతి

శుభ్రజ్యోత్స్న సుగతిశాంతుల
నడల మా మనుగడల దీర్చర
సుప్త మానవ దీప్తికై పటు
శక్తి గూర్చర శంకరా భవ !

ఓయ్ రుద్రా
కాల నేత్రోజ్జ్వలిత రౌద్రా
ఓయ్ రుద్రా !

# గచ్ఛతీతి జగత్

ఇది పురావిభవమ్ము
లెదసొంగ నుప్పొంగు
పటులుం ఘటాంకి
పరివర్తార్ణవము

ఇట శౌర్య పెన్నిధుల్
వీరతాండవమాడ
పరరాజ మూర్ధముల్
ఒరిగి నెలన్ వ్రాలె

ఇది కళావైభవో —
ద్విదిత మణిమేఖలము
రచిత శిల్పానేక
రాజిత విహారమ్ము

ఇటకావ్య ధారలే
ఎగసి సొగసుల మిగిలి
జిజ్ఞాసువుల మనో
విజ్ఞతను తరచినవి

ఇది ధాన్యములరాసు
లెత్తియోడల బనిచి
అన్నపూర్ణగ ఖ్యాతి
నందిన ధరాతలము

ఇట రత్నచయములే
వీథులందుం జూడ
గనుపట్టి కనుకుట్టు
కలుగజేసెను మిగుల

ఇది సత్త్వభావ ధీ
నిధుల గనుసన్నలన్
సకల సౌభాగ్యాల
సంపుటీకరణమ్ము

ఇటశీల సంఘాత
పటుసత్య యోగార్థ
నిక షోఫలమ్ముతై
నివ్వటిల్లిరి జనులు

ఇది చిత్తచాపల్య
వివశులౌ పాలకుల
మతిహీనమున దాస్య
మగ్నమై నెవసనది

ఇట ప్రజాసంరంభ
వీచీహతాళులై
సామ్రాజ్య బృందముల్
సాగిపోయిరి వెసను

ఇది నెడు సంకీర్ణ
పదవీజ్వరాగ్రస్త
కులవర్గ విచ్ఛిన్న
కులిశాభి ఘాతమ్ము

ఇట త్యాగ నిరతులై
కటిబద్ధులై నిలచి
భావి తరముల యశో
భాగ్యముల దీర్చవలె

ఇది ఆత్మశోధనల
కీరవైన సమయమ్ము
చెలరేగు కలుషాల
తొలగించు కొనవలయు

ఇట యౌవనోద్భూత
నిటలాక్షి ఉదయించి
కుటిలాంధకారావ
గుంఠనము జీల్చవలె

ఇది భరత నరనారి
ఈప్సితోద్దేశమ్ము
సకలోర్వ శుభకాంక్ష
సందేశమూలమ్ము

[illegible]
వాత్సల్య మాధుర్య
సంఫుల్ల నవరాగ
సంస్కృతుల్ జనియించు

14 7 1967

# ఎక్కడికి పయనం?

దిన దినము జీవనో
ద్దీప్త భ్రమింగిం యిులు
ముసుు కొని యుయుయులను
మెసవి గ్రుయంత్రేప్చె

చిరుప్రాయముల మనో
హర దృశ్యముు చెదరి
గుపంర నిరుద్యోగ
పరిపా మొదవినది

నైరాశ్య హేలా వి
నోదాల క్రీడలను
విపరీత కాముకో
ద్విపరియా ప్తము దోచె

నాగరక భావనా
నగ్నతాండవకేళి
వలువలూడ్చిన చిత్ర
వైవిధ్యముల వెలసె

మానవత్వము రక్త
మసృణమ్మున దోగి
మైనలది చెల్వార
మతిభ్రమణములు గలిగె

స్వేచ్ఛామనీషతా
సింధూరమె చెదరి
శాంత కల్హారమ
ధ్వాంతమున బడినగ్గె

గోళాలతో చెలిమి
మెళవించిన నరుడు
భూగోళమున కరుణ
పూర్ణాహుతిని గొనియె

# నవ క్రాంతి

నీ కాంత కిరణాలు
నిఖిల సృష్టికి శాంతి
తోరణాలై సమత
కారణాలై వెలయు

నీ కనుల ప్రేమరస
నిర్ఝరులు పెల్లుబికి
మరుభూములే పంట
మాగాణులై తీరు

నీపదన్యాసాల
నిర్వక్ర విక్రమో
ద్ధతిలోన దానవత
హాలభాగ్యమైపోవు

నీదు దరహాసాల
కేదార వల్లరులు
మానవత్వపు మహా
మంగళ పతాకలౌ

నీరాకతో ప్రజల
నైరాశ్యములు డల్లి
నవనవోన్మేషమై
నవజగతి ప్రభవించు

విరియుమా! విరియుమా
విఋవీధి నవకాంతి
సంక్రాంతి శుభకాంతి
జన హృదయ విక్రాంతి

# ఓ మహాత్మా!

నా దేశాన్ని
పతనోన్ముఖం నుండి
దౌర్భాగ్యం
జీవితాన్నుండి
ఉదరించు
ఓ మహాత్మా
ఉద్ధరించు!

బాహ్యశృంఖలాల
బరువుల్ని వర్జించి
అంతస్సౌందర్యాన్ని
ఆరాధించే పటిమ
ప్రసాదించు
ఓ మహాత్మా
ప్రసాదించు!

అల్ల కల్లోలాల్ని
అకాల వెల్లువల్ని
మనోయవనికల్లో
మండుతున్న విభేదాల్ని
నిరోధించు
ఓ మహాత్మా!
నిరోధించు

అనాధుల ఆర్తనాదాల్ని
అక్రమ వ్యామోహాల్ని
అంటరాని తనాల్ని
అహంకారాల్ని
పరిహరించు మహాత్మా!
పరిహరించు

ఆచారాల పేరిట
అనాచారాల్ని
అనురాగపు వారధితో
అధిగమించే నేర్పు
కలిగించు
ఓ మహాత్మా!
కలిగించు!

అందాల సుమవనంగా
ఆనందాల పరిమళంగా
నవ్య భారతావని
వర్ధిల్లాలని
ఆశీర్వదించు
ఓ మహాత్మా!
ఆశీర్వదించు!

5-8 1970

# వినతి

సాంబశివా? మహోదధి విషాదతమః పటలాంబురాశిలో
లాంబరక్రీడలన్ దవిలిలౌల్యము వీడగలేని యజ్ఞులన్
దాంభిక మూలకందమగు తాపులప్రోవుల ప్రేపకుండి నీ
శాంభవి శాంకరీ వివిధ శక్తులతో మురలింపవే హరా

నీదగు సృష్టిజాలమును నెత్తుటేరుల ముంచజూచు నీ
మాదకతా విమత్తులను మౌనముతో గమనింతువా ప్రభూ!
పాదవిఘట్టనన్ విగతప్రాణులజేయుచు లోకరక్షకై
క్రోధ దవానలోజ్జ్వలిత ఘూర్ణితనేత్రము విప్పుమో హరా!

భద్రవిఘాత రౌద్రతర బాహారశక్తుల జృంభణమ్మునన్
ఛిద్రవిఛిద్రమై జగతి జీర్ణకృశాహతశేషమయ్యెడిన్
రుద్ర! భయంకరా! ప్రళయరూప మహోజ్జ్వల కాలనేత్రుడా!
క్షుద్రవిహీనభావ పరిశుద్ధముగా మహాదిద్దుమో హరా!

లేవిట నీతిశాంతములు లేశము మానవసంఘమందు న
స్నేవిధినైన బెత్తనము నెర్పన సందెడి లక్ష్యమొక్కటే
స్థావరమై యనంత పరితాపము గూర్చెడి గుండెలోతులన్
కావగరాగదే పెనువికారపు బెంపులద్రుంపుచున్ హరా।

మెత్తని పల్కులందు సుతిమెత్తని కత్తులదాచి నేర్పునన్
యొత్తిడిలేనిమార్గమిది యొక్కని నెన్నికచేయుడంచు మా
కుత్తుకమీదనొక్కి తమ గ్రూపుకు ఎచ్చముగట్టి దేశమున్
గుత్తకుగొన్నయట్లుచను కూటమినెత్తిపెంచరా। హరా।

ఎడుగడేని లేని ధరణీతలవాలన కూలిపోవగా
వేడుకజేసినాము పెనుపీడలరక్కసి జాడలేని బల్
పోడిమిదారులన్ బ్రతుకుపోకడపొంగు తెలార్చునంచు నా
రూఢిగ నమ్మినాము శివరూపగుణాకర శ్రీకరా హరా।

గోతులుద్రవ్వుచుండిరయిగో కులపాంసనులై వికారపు-
న్నేతలు జీవనాడులతి చేర్పున కేలబిగించి దేశవి
ఖ్యాతి కళంకమార్గము లఖాతములై జనరాజ్యపాలనో
ద్ద్యోతములో విపద్వికట ధోరణిజృంభణమొందగా హరా।

ఒక్కరి యున్నతిన్ గనియు నోర్వగలేని యసూయబారికిన్
జిక్కియు దుఃఖభారమున చిందులుద్రొక్కుచు నాగ్రహంబు వే
గ్రక్కెడివారికిన్ తగిన గమ్యపథమ్ముల గాంచునట్టి పెం
పెక్కగ జేయరా సరగ వేల్పుదొరా త్రిపురాంతకా హరా!

ఈసున పల్లవించి చిగురించు సహంకృత దోషమాంసలో
ల్లాస విభూతులన్ బెనగి రాశికిపనకి ద్రాకజాలకన్
మోసపు వాగురన్ దవిలి యిందుగతిన్ దలపోయ రేయియున్
గాసిలి జె దువారలను గావగ దిక్కెటువెగా హరా!

కొందరు సర్వసంపదల కోశముతై వెలుగొందుచుండగా
గొందరు లేమిపాలబడి కుందుచు కర్కశజీవనాధ్వరం
బందున జిక్కి వ్రేలుచును పైకొనుబాధల రక్తగాథలన్
డెందము వ్రీలిపోవ గనుచేలర చంద్రకళాధరా! హరా

రేపటిముద్దకోసమయి రెక్కలుముక్కలు జేసుకొన్నటో
దోపిడిమూక తంత్రమున దొంగిలిచల్లగ మ్రింగివేయగా
కోపభరమ్ములైన కనుగొల్కుల నిప్పులు రాలుచుండగా
మాపటిసంజలో మతులుమండెడి వైనమదేలరా! హరా!

ఇక్కడి తంత్రజాలముల కెక్కి భీతిలి నక్కియుంటివో ?
ఎక్కడనుంటివో ? జగముకేగతిదీర్చగ బూనుకొంటివో ?
మక్కువనిన్నుగొల్చు నభిమానులవేదన గాంచకుంటివో ?
నిక్కపువేల్పు వీవనుచునెంచిన నేమిఫలంబురా హరా

చిత్తము వ్యాకులాన్విత విశీర్ణము జీర్ణమునై విశృంఖలా
యత్తము జేయుచున్నయది యౌవన కాలవశీకృతమ్మునన్
మత్తున దోగుచున్నయది మౌనిగణాంచిత విశ్వమౌళి వే
యుత్తలపాటుడల్చి యొగియున్నతిగూర్పగ రమ్మురా హరా

ఆరని యగ్నితాప జనితామితశోక భరమ్ములన్ సదా
భారమునైన మానసము ప్రజలదివ్య సుధామధూక్తి వా
ర్ధారల గ్రుమ్మరించియు నుదారదయాసముదాయ కోటితో
వారణ జేయవేర మునివందిత జీవకృపాకరా హరా

చిత్తము నమ్మి యీప్రజల రాజ్యముకై పరిశీల్పి మిత్రవ
త్సక్తిని శాంతిపోసి నవశాంతిని గూర్చ దలంచి వచ్చుమా
భక్తుని దేశమాత ఎద దమ్ములయందు నిల్పి యే పురా
వృత్తికి దేవరించెదను — ముచ్చటదీరగ చెప్పుమో హరా !

వాయక శ్రామితావళికి బట్టినదుర్దశ బాయజేయగా
నాయువు ధారవోసితి వినమ్రుడనై తపమాచరించితిన్
కాయము దప్పునన్ జనవికాసమె ధ్యేయముగా పునర్నవ
శ్రీయెసగారు సత్కృషవిశేషముకై ధృతినిమ్మురా! హరా!

ఈ నటనాలయంబున నటింపగ నేడికచేవలేదు నా
ప్రాణముమీదుకట్టి స్వభావసమాశ్రయరీతులన్నిటన్
ధ్యానము నిల్పిచేసిన ప్రయత్నములన్నియు లిప్తమాత్రలో
పూనిక దప్పుచున్నయవి పూర్వవిశేషఫలంబుచే హరా!

నీ నయనాంచలాల ప్రవహించెడు నిశ్చలకాంతిలోన యే
జ్ఞానము విస్తరించును దిశాంతములన్నిట తొంగి వించు నా
లోనరంహించిమించు రసలోకములన్నియు నవెకావె యో
మానితభక్తపాల! నిగమాగమలోల! పరాత్పరా! హరా!

మంగళశాసనమ్మున నమంగళజాలముబారద్రోలగన్
మంగళగౌరిగూడి యిటమాహృదయాంతరమందు నుండుమో
యంగజగర్వభంగి! రిపుహంతక! సాధుజనాంతరంగ! ని
స్సంగ! భవాంతభావవిభ! శాంతిమహోదయ భాస్కరా హరా!

9 9 1965

# జ్ఞానయోగి

శ్రీమధురార్ద్రగీతముల జిప్పిలునిస్తులగోస్తనీ రుచుల్
రామపదారవింద రుచిరార్ణవభక్తి ప్రభావిభూతికిన్
దామములై విశాలజనతానుతయోగము నందుకొన్న శ్యా
మలమూర్తి దాశరధి కావ్యప్రణేతకు కేలుమోడ్చెదన్

పావవులూరు రాగము లవారిగగుప్ప హృదంతరాలలో
రాచప్రణమ్ములై సలుపు రక్కసికోర్కెల మూలతత్త్వమున్
పీచమడంచి దివ్యగుణప్రేరణదీప్తులు విస్తరిల్లగా
యోచనజేసినట్టి రసయోగ గుణాకరు బ్రస్తుతించెదన్

రాముని సేవలోవిధి విరామములేని మహానుభూతితో
మామక మానసాంబుధిని మైపరపించు సుధామయోక్తులన్
కోమల శబ్దజాలమున క్రొవ్విరితేనియలూరు పద్దెముల్
నీమముతో రచించిన పునీతుని గోపవిప్రు నెన్నెదన్

ఈ విపరీతమేమి యిటులెవ్వరుజెప్పరి రాచవిత్తమున్
దేవుని భోగభాగ్యములు దీర్చగ నెగితి పెచ్చుపెట్టితో
ఆవలగల్గు కష్టముల ంంఽముల న్నది నూహ యవో
కావ, నిచ్చువారి ధికారము ెర మ్మికొంచిచో

శ్యామల వర్ణదేహునకు చక్కని కెంపుల లాంహారముల్
రామునినీడయైమెలగు లక్ష్మణమూర్తికి పైడిహారముల్
భూమిజముద్దుదీర సరిముక్కెర పచ్చలహారముల్ పం
ధాముని నమ్మియిచ్చి సులతానులఖైదున స్రుక్కినావుగా!

నీ సకలంబు రామరమణీయ పదంబుల గ్రుమ్మరించి పే
రోల మూలమట్టముగరాలిచి నిశ్చలభక్తిభావమే
దాసయచునమ్మి పలువాములనాలిరి మొక్కబోవక్
జెనన పూజలే నిను విశిష్టమనీషగ జాటుచుండెరా!

రెయికిరేయి నీబుణము రెక్కలుగట్టుకు వాలినట్టులా
సాయబు టొక్కసార జమజగ్గిన మూలరవాస్యమెట్టదో
న్యాయముపాయమో? మనసుకందగరాని మరే ప్రభావమో ?
మాయురె! నీదుభక్తి పెనుమాళ్ళనునైతము బంటుజేసెరా ?

కోవెలగట్టినావు సరిగోపురమున్ నిలబెట్టినావు యే
త్రోవలులేని భద్రగిరి తోరపుతీర్థముగా రచించి నీ
పావన భావనాగరిమ భక్తినిగానము జేసినావహో ।
దేవుని పూజలోమునిగి దివ్యతనందితి రామదాస వై ।

ఈ జన్మా సంబు పలికించితి కమ్మని పాటలందునన్
రాజితకీర్తనీయు రఘురాముని ప్రేమఫలమ్ముగోరి నీ
రాజనమెత్తినావు విపులంబుగ కైతలవెల్లువన్ శర
ద్రాజిత చంద్రకాంతియమృతంబు నిలాతలి నిండిపోవగా

ఏ యుగమందు ఎంచెల నింపుగరాముని కిచ్చినావో ? నే
డాయుగమందె మేము పలురక్కులదైవము కన్నిగవ్వయే
మాయనుగుప్పయైన బహుమానములన్నిటి చప్పరించి గో
మాయులమింటినాము జగమ దున మానితభక్తశేఖరా ।

పాపభయంబుసున్న పౌరపాటున సత్యమ ల్యమన్న మా
గోపన వృత్తులెన్న నెరిక్రూరత పోలికలేదుసున్న యీ
తాపముతీరదన్న దనదాహపురీతులు మారవన్న యే
శాపము హేతువన్న మన సంస్కృతి వక్రతజెందగా ఋషీ ।

దాన నిదానముల్ వెగటు దండనభీతిహుళక్కి నవ్యతన్
గానని చేతముల్ మఱియుకాతరదృష్టి వికారముల్ సదా
మానవజాతి వేదనలు మాన్పెడి నిర్మల సత్యమార్గముల్
జ్ఞాన ప్రపూతమై వెలుగి నొందినిబల్కుము యోగిపుంగవా?

తాతలనాటి నాగరికతా చరితా ప్రతిభావిశేషముల్
పాతరద్రవ్య రాసులను బండ్లకునెత్తి తెలుంగునాటలో
చేతన మెయికొల్ప కృషిజేసెడి ధీయుల నూత్నభావ హే
లా తరళాంతరంగులను లెస్సగ బ్రోచుత హే కవీశ్వరా

# కైమోడ్పు

పల్కిన పల్కులో నమర భారతి రూపము తొంగిచూడగా
తిల్కముదిద్ది తెన్గుసతి తేనెముకొద్ది దీర్చి నట్లుగా
చిల్కిన భావసంగతుల జీవన మాధురితొల్కి నట్లుగా
పల్కరించు కావ్యముల పంటలనూర్చితి తుమ్మలాన్వయా

పాతపురాణ భాగముల భద్రముగానిటు సంగ్రహించి వి
ఖ్యాతి దలిర్ప కైతలని కౌతుకమొప్పగ విఱ్ఱవీగుచున్
నీతులుజెప్పు లోకులను నిందయొనర్చెడి తెర్వుబోవకన్
నూతన భారతీయ రమణోజ్జ్వల కాంతుల రక్తి జూపితౌ

సాధు పవిత్రుగాంధిముని సత్యవచోనిధి నాత్మగాధలన్
బాగుగు జాతిసంపద కనారతమౌ రతనాల రాసులన్
గాదెలకెత్తినావు కవిగా ఋషిగా వెలయించి నావిలన్
వాదములేదు నీకుసరివారలలోన కళాప్రపూర్ణుడా!

కోమల భావనామృ౦పు కూ౦మురై  ర౦రాజ్యసీమకున్
భూమికలై నవీ౦ ౦విపూర్ణముతో ౦డిగూర్చి నిల్పగా
౦మముదాల్చి ౦చ్చ౦ులనేకము పెల్వ౦ చేయుచు౦న్న యో
ధీమణి  సీతరాము ౦విదేశి  ౦కిదె కేలు మోడ్చెదన్

ఇంతకు నింతగాగ తెలుగెంతయొ పెంపుచ౦౦ములందిగన్
పంతముబూని నిల్వమిల పల్కు వెలందికి ౦౦వు౦బ్బగా—
శంతను పుత్రువోలె నిజశాబ్ది భీష్మప్రతిజ్ఞ బూ౦ు౦న్
వంతలు వైదొలంగి చనవర్ధిలు పూర్ణమ౦ష్వై౦వీ!

18 12 1969

# నివేదన

సోదర రక్తధారలను చూఱలుగైకొని మానవత్వమే
చెదని వక్రమార్గములఁజేయుచు తామసరూపధారులై
వేదన చెందువారికి నివేదనచేయగ సాధుతత్త్వమున్
వాదొనరించి పెన్నిడినుపాయములన్ ఘటియింప లెమ్మురా

ఎండిన గుండెలున్ కరటు వెమరతేని యపూర్వవాసనల్
పండిన పాపకృత్యములు పౌరధనాహరణైక బుద్ధులున్
నిండిన కూటభావములు నీతిదొరంగిన భ్రాతృవైరముల్
చెండుము నిష్కళంకమయ జీవనమున్ సృజియింపరమ్మురా

వాదుల పాదులంబెరికి వన్నెఘటించెడి మేటిదారులన్
బోదెయిదోచు స్వైరాతర ఘోరవిఘాతుల సత్వరంబుచల్
నాదెయి నింపబోలు నిగారపుహాయిల వారసత్వమే
మోదిని మానవాభ్యుదయ మార్గములో మునుసాగిపోవరా !

చెరములోన లోకములు శ్రీకరమై తనరారునంచు ఎ
చేతములోననమ్మి తగుచేష్టల సాత్వికాలంబు నూత్నసా
హేతుపు తుత్తరించి సుఖశాంతుల దీనుల గుండెమంటలో
లోతులు దెదియాది సమరాక్షమువర్థిల దీక్షబూనరా

3 2 1969

# వేడికోలు

గోచులు ముంతలున్ మురికికుప్పలు బొంతలు చింకిచాపలున్
యాచనతోడి జీవనము యాకలిమంటల కాలగోడులున్
తోవనికాపురంబు తొడలొక్కెడి గంపెడు పిన్నబిడ్డలున్
మోచుటకంటె తానుపమున్నదె వేరెటయెంచి చూడగన్

కూడునుగుడ్డలేక నెదకోర్కెలు దీరెడిరీతి బిడ్డలన్
వేడుకబెంచలేక నడివీధుల పాలొనరించి జాతిలో
నాడుల జీవసంపదలు నంజెడివారికి దోడునీడలై
గాడినిదప్పువారలను గాంచగ గుండెలు బండలయ్యెడిన్

పల్లెలు పట్టణాలెచట బట్టనిరీతిగ పెర్గుచున్న యీ
ఎల్లలపాపలన్ బడులపేర్మిని జేర్చగ చోటులేదులే
చల్లని నీడనైన తగుశాలలు నెయెడ గానరావుగా
తల్లులు దండ్రులారా నిజతార్కికబుద్ధిని జూపుడీయెడన్

పూటకు పూటకుం బెరిగిపోయెడు యీ నరజాతికెందునన్
చోటనలేదు ఘూతలిని జూడగభుక్తికె దారిలేదు మో
మోటముచేని సత్యమిది మాన్యులువేగమె యీప్రమాదమున్
దాటెడురీతులన్ వెదకి తద్దయు బాసటనిల్వగావలెన్

3 11 1975

# జయగీతి

లెమ్ము లెమ్ము సత్వరమ్ము
భారతీయ యోధుడా
రమ్ము రమ్ము ధర్మసమర
రంగమందు నిలువగా

అన్నదమ్ములందు కలత
లున్న చేటు మూడురా
ఐకమత్యమన్న గొప్ప
ఆయుధమ్ము తెలియరా

మతముపేర తోటివాని
కుతక నరుక తగదురా!
హితముగూర్చ లేనిమతము
విడచి మనుట మేలురా

కులము పెట పెనుభూతం
కోరలూడ బెరుకరా!
ప్రగతి మేలి బాటలలో
పయన మొనరుటె సుఖమురా!

జాతిగౌరవమ్ము మించు
ఖ్యాతి యేమిగలదురా!
ఇల్లు దిద్దుకొనుటలోన
ఉల్లదమ్ము వీడరా!

తల్లి యొకతె భరతమాత
యుల్లమందు నిలుపరా!
పొల్లు మాటలేల జయము
కొల్లగొనుట చెన్నరా

3 3 1964

# జే జేలు

దేశభక్తిని తెల్పు గీతులు
ఎక్కిమేనుల పుల్కరింపగ
జాతిహృదయపు లోతులందున
చిలికితివి నవచేతనమ్మును

అమరకవి ఓ అప్పరాయా
అందుకొనుమా వందనమ్మిదె!

జనులవాడుక నుడుల లోగల
ముద్దుపల్కుల నుద్ధరించియు
మోదమేసగగ ముత్తెములుగొని
గుచ్చి బాసకు కూర్చితివిమేల్!

భావదాస్యపు బంధనంబుల
చిక్కివడలిన చక్కదనముల
తెలుగు కన్నెల దీనవృత్తము
నొక్కి చెవులకు నెక్కజేసితి॥

నవనవోజ్జ్వల కవనరీతుల
సోయగంబులు చూడ నొల్లని
పండితుల పాషండ వాదము
ఖండ ఖండముగాగ చెండితి ॥

ప్రాతక్రొత్తల భావసంపద
మేళవించెడి మూలమెరిగి
ఎలుకుసతి కను విందుగాగను
పసిడి జిలుగుల బాట దీర్చితి ॥

కొసరి తేనియయుచుల తెన్గుప
సంఘ సంస్కరణాభిలాషను
రంగరించిన భంగిమలతో
ఆణిముత్తెపు నాణెమొప్పగ
విత్తితివి సరిక్రొత్త కథలను ॥

జాతి పతనపు సరళి దెల్పెడి
కన్యశుల్కపు కల్మషమ్మును
కడుగు నాటక కళను చూపితి
పాత్ర చిత్రణ పాటవమ్మున ॥

### చైతన్య స్రవంతి

మతము మతముకు మధ్యవైరపు
మచ్చరమ్ములు నిచ్చగింపక
ఎల్లమతముల నుల్లసిల్లెడు
నామమేదో చాటిచెప్పితి ॥

స్వార్థతత్వము దాస్యతత్వము
హీనమని వినిపించు మమతల
పెంచి వెలుగును నించి జగతిని
మంచి తనమున ముంచినావు

అమరకవి ఓ అప్పరాయా
అందుకొనుమా వందనమ్మిదె !

# కర్పూర నీరాజనము

వందనమో గాంధితాత !
శాంత హృదయాధినేత

పరపీడాకర దుఃఖిత
పరితాపజ్వాలిత మానవ
శృంఖల విచ్ఛేదనకై
శంఖము పూరించినావు ॥ వం ॥

ప్రత్యణువున రగిలి రగిలి
ప్రజావహ్ని ప్రజ్వలింప
శాంతియోధ ! సత్యాగ్రహ
సమరము నడిపించినావు ॥ వం ॥

సకలాయుధ నికరాన్విత
సైన్యచమూ సన్నద్ధుల
ఆత్మ బలోన్నత శక్తిన
అవలీలగ గెల్చినావు ॥ వం ॥

దిక్కుతెన్ను తెలియరాని
దిశవిశిత మానవాళి
అప్రకటము లరసి మనో
వ్యగ్రాంతిని పీడవావు ॥ వం ॥

మానవుడే మాధవుడని
మనుజసేవ మధువమ్మని
వెలిజనముల వల వంతను
తలపోసి తపించినావు ॥ వం ॥

సహనమే ప్రత్యూషము
సద్భావమె నిఖిలోర్వి
సుగతి మూల సోపానము-
ప్రగతిమయ ప్రద్యోతము ॥ వం ॥

శ్రీకర మధు శివకర సుఖ
శింజిని రవరంజన మా
నాకముగా నవభారత
లోకము కావించినావు ॥ వం ॥

చైతన్య స్రవంతి

భారత జన భావాంబర

తారకవై తమోహారిణి

శాలు వై శోభాయవా

హోంతువును అ దుకొనుము

వందనమో గాంధితాత

భారత హృదయాధిర

# సంస్కృతి

జయతు జయతు

భారతమాతా।

జగద్వందిత

శుభచరితా

జగన్మాన్య జయవిహారి
శాపదాస్య బంధహారి
స్వేచ్ఛారథ సూత్రధారి
ప్రేమాస్పద ప్రియభాషణ
నిరతసత్య నియమశీల
సమతానవ శాంతిహేల

దీప్తప్రాంత దీపలోక
నిఖిల నిగళ నిర్మూలక

మాతృ హృదయ [illegible]మాలా
భగీరథ త[illegible] [illegible]యాప

జగదంతర శాలలోన
కనుమలిగిన కాంతిరేఖ
రగిలించిన రాజర్షీ
దీక్షకై వాలికపై
ధరణిగుండె లయిగుల్లై
వర్ణభేద వైరములను
పెకలించిన ప్రియ బాపూ

దురావేశప్రభంజనుని
దరహాసపు తరంగంతో
నిరోధించు సుపరాక్రమి

దిశావలయ తిమిర హరా
సుజనార్ణవ సుధాకరా
పూత చరిత లోకనుతా!
సద్వందిత జననాయక!

జయతు జయతు
జాతిపితా
జనవందిత
శుభ చరితా!

18 9 1961

# భారత భానుడు

స్వాతంత్ర్యపు రథసారథి
స్వేచ్ఛామయి శాంతిదూత
సంహారాల కల్పాయుధ
భయమెరుగని ధీమంతుడు

భారతి పుణ్యాల పంట

వేడివేడి నిట్టూర్పుల
వాడిపోవు జీవితమును
ప్రేమ మాట చిగురించెను
జాతులను చరియించిన

సద్గుణ సందోహ విహారి

అధునాతన ప్రజారాజ్య
పథనిర్మాణ మహాశిల్పి
నిరుపేదల పెనుబాముల
పరిమార్చగ శపథమూని

శ్రమించిన త్యాగశీలి

కుటిల శృంఖలముల్త్రెంచి
టుసౌఖ్యం పండించెడి
వెలుతేని ఆయులులేని
పరివర్థిత తరుణావని

ఆశించిన అమరమూర్తి

మానవమేధోంతరాల
మణిమోహన నవభావన
మండిత కోటింకోటి
మసృణారుణ కిరణావళి

సృష్టించిన శాక్యమౌని

సామ్యవాద సమరాంగణ
శాత్రవగణ విచ్ఛేదక
భారత జన హృదయాబ్జపు
పక్షాంచల పరితోషక

భాస మానభాను శతము

13 6 1964

# మహా పథికుడు

కడలు కొనియెడి దాస్యశృంఖల
కాళరాత్రుల కటిక చీకటి
సాంద్రోలగ ప్రతిన బూని
వీర భారత యోధుడా!

ంచి పరతంత్రపు పిశాచుల
పీచ మణచగ దేశవాసుల
నొక్కబాటను నడిపి గెలిచిన
మొక్కవోని వీరుడా!

[illegible]రమ్ముల నిద్రమేల్కొన
తరతరమ్ముల శక్తిగిల్కొన
క్రాంతి కాహళ గళము నెత్తిన
శాంతి భారత పుత్రుడా!

భారతీసతినొసటి కుంకుమ
పండు వెలుగులు జిమ్మువరకును
గుండె గుండెకు నీదుస్మరణమె
అండయై నడిపించురా!

మాతృ సేవా దీక్షాకంకణ
మానవోన్నత మహానుభావుర
జయము జయమో జాతినాయక
జయము జయము జయమహో !



అతినిర్మల మమతామతి
వాతవాంఛిత సత్యనిరతి
సుమపేశల భావోన్నతి
కమనీయమూర్తి కాంతి !

# తొలకరి

పౌర్ణమి వెన్నెల నేడు
పొంగి పోతుంది
క్రొత్త నిసువును చెంత
నెత్తుకో సుంది!

తొలిమెరుపు కాంతిలో
గల వలపు క్రొమ్మెరుగు
కలబోసి కొనిలోన
పులకరించింది!

ఆషాఢ జీమూత
ఘోషోద్ధృతంబులను
పొలయల్క పల్కులుగ
తలచు కొంటుంది!

సలిల ధారాబద్ధ
సంపర్కమున దోగి
ప్రియ వశంవదవోలె
హొయలు జూపింది

చైతన్య స్రవంతి

ఠరితీపు మురిపాలు
నెంవేరెసలి మెచ్చి
పచ్చి బాలెంత కను
విచ్చి కులికిందీ!

నవ్వులో నసతెత్తి
ఒ ర్వగస్పడిసంల
సచ్చన్ని సోయ, పు
పయవ మొలికిందీ!

# ఏర్వాక

తొలకరి మొయిలుతో త్రుళ్ళింది నభము
కలతదేరిన రైతు కదలెను పొలము
పరువు పక్షుల క్రూర కంఠమ్ము సులుపు
ధరణి తన్మయభావ తాండవమ్మాడ
శార్వరి పులకింప జనతనుతింప
ఏర్వాక పూర్ణిమా! ఏతెంచవమ్మా!

గ్రుక్కెడు సీరముల్ గ్రోలనులేక
స్రుక్కిన జీవుల సొలపులు వాయ
కారుమేఘము గ్రమ్మె గగనభాగమున
ధారలను జిమ్ముచు ధరణి గ్రుమ్ముచును
పూర్వ తాపముబాపు పండువై తనర
ఏర్వాక పూర్ణిమా! ఏతెంచవమ్మా!

11-7 1973

# పంటసిరి

తొలిజల్లు వచ్చింది
తొలకరించింది
పదవోయి రైతన్న
పాటు చెయ్యంగ

హలమే మన సౌభాగ్య
బలమనుచు నాటి
పొలము దున్నాలోయి
పొలికేక బెట్ట

కదలరా వడివడిగ
పదను చెడకుండ
అదనులో విత్తనము
వెదజల్లవలెను

అడవులును బంజర్లు
వసువుగా జేసి
సహకార సేద్యమును
సాగించుమన్న

తరుణ మందున పనులు
తెరువెరిగి చేయ
ఎపుగా పైరెదిగి
కాపు ఎదున్న

విదిలించరా నిదుర
ఎదిరించరా శక్తి
పసచెడును నీ విపుడు
ప్రాల్మాలియున్న

తొలికారు మలికారు
బాలిగల్గి రాల
ఇనుప గజ్జెలతల్లి
వెను దిరుగునన్న

బలము నీవే జాతి
కలిమి నీవేరా!
పాతరల బంగారు
పంట నింపుమురా

14-3-1960

# దీపావళి

దీపావళి దీపావళి
దివ్యనవ్య శోభావళి

సంమారక నరకాసుర
పరికల్పిత కరాళాంధ
ధారాకృతి దౌర్జన్యము
దివ్యశిఖా దీప్తులతో
పరిహరించు పర్వదినం

దీపావళి దీపావళి
దివ్యనవ్య శోభావళి

పైశాచిక వాంఛాపరి
దహ్యమాన దానవాళి
చైదమ్ముల జనియించిన
మలిన మరణకలితములౌ
సమరాశ్రుషులు జగతికనుల
కడిగి విమలకాంతి నింపు

దీపావళి దీపావళి
దివ్యనవ్య శోభావళి

త్యాగోజ్జ్వల రాగామల
రక్తిమతో దిక్తటముల
దివ్వెలన్ని తేజోవహ
పరిఫుల్లిత వింశములగు

దీపావళి దీపావళి
దివ్యనవ్య శోభావళి

నరకాసుర పరిరంభం
నరలోకపు టురికంబం
చిరకాలము జీవించదు
విరిగి ధరణినొరంగు ననుచు
ప్రభవించెడి పర్వదినం

దీపావళి దీపావళి
దివ్యనవ్య శోభావళి

25 10-1961

# కాంతిధార

సౌత్రాజితి సముత్సాహా
సరిజ్ఝరీ తటిల్లతల
మొలకెత్తిన ఆశావళి
పులకించిన శోభావళి

వక్రభావదైత్యుల ని
ర్వక్రచక్రధారాహతి
ఛేదించిన శౌర్యావళి
చిత్రవర్ణ తారావళి

తమోచ్ఛన్న తత్త్వాలకు
దారుణ సంఘాతమైన
పర్వదినం హేరావళి
ప్రమోదాల నాట్యరవళి

నరనారీ హృదయాంతర
పరివర్థిత తరుణశక్తి
విజయగాన ఘనకాహళి
[illegible]

రక్తపాశ యుదోన్మత్త
వర్తించరి సంకాలుర
శక్తి పెంచు విజయ దేశి
శరదిందిర రూపావళి

పెంజీకటి పెకలించు
కెంజాయల ప్రసరించే
మరోదివ్య తిలకావళి
ధరణికి నవభూషావళి

16-10 65

# పౌష్యలక్ష్మి

తెలుగింటి మొగసాల
జిలుగు ముగ్గులుదీర్ప
తెలుగమ్మ మోములో
వెలుగు నిగ్గులు గూర్ప

ఏడాది కొకమారు
ఎతెంతు వీనాట

సస్యలక్ష్మి మోద
లాస్యాల కింకిణీ
రావములు ప్రతిగృహా
రామముల నినదింప

ఎడాది కొకమారు
ఎతెంతు వీనాట

నవధాన్య సంకలిత
విధ సుమరంజములన్
తలదాల్చి గొబ్బిళ్ల
తలవాకిటను నింప

ఏడాది కొకమాయి
ఏతెంతు వీనాట

రంగిపల్లుల తీరు
సంగారం మొనగూడ
హరిదాసు సంకీర్తి
ఆనంద మొప్పాం

ఏడాది కొకమాయి
ఏతెంతు వీనాట

రంగు గవిశన దాల్చి
గంగిరెద్దులు ఆడ
వీక్షించు పురజనుల
వేడ్క హద్దులుమీర

ఏడాది కొకమారు
ఏతెంతు వీనాట

బోతలందివ గొర్రె
బొట్టేళ్ళ తలపోరు
ఎందెమొడ్డిన వారి
పట్టుఎల లాగిమీర

ఏడాది కొకమారు
ఎతెంతు వీనాట

నిక్కి రెక్కలనార్చి
కొక్కరోయని కూసి
కత్తులను ఒండొంటి
కుత్తుకల మత్తరిల

ఎడాది కొకమారు
ఎతెంతు వీనాట

ఊరూర యువజనుల
యుత్సాహములు పొంగి
ఆటపాటల క్రొత్త
యందాలు సమకూడ

ఏడాది కొకమారు
ఏతెంతు వీనాట

ముద్దబంతులు నగను
ముడిచి కన్నియలాడ
కన్నెముంగముల కళలు
కరిగి వాకలువార

ఏడాది కొకమారు
ఎతెంతు వీనాట

రైతు నట్టింటిలో
రాశిపాల్ నిండార
గుమ్మముల పూఎండ
గుత్తు లూగిసలాడ

ఎడాది కొకమారు
ఎతెంతు వీనాట

21-9 1961

# కౌముదీమహోత్సవము

ధవళ దవళావ్ఛాది తాధుం
తరుణభార వయో విలాసం
ముగ్ధమోహన రూపసుందరి
స్నిగ్ధహాస కపోలయుగళము

లందుహత్తిన జిలుగుసౌరుల
నందుకొన్నది కౌముదీప్రభ

లలిత లలిత కషాయ రంజిత
రాగ పల్లవ తరులతాతతి
కురులనెరి పత్రాంచలమ్ముల
కోరిదిద్దిన వెలుగు పూవుల

సరుల నభినవ సోయగమ్ముల
సంతరించెను కౌముదీప్రభ

చికురముల ఎహో మౌక్తిక
విహ్నముల నొప్పారు శాద్వలి
మనోముకురము ఎరియు కౌతుక
మార్గమునవడి నిర్గమించిన

శరత్పాండుర కిరణజాలము
బంపె వసుధను కౌముదీప్రభ

ఝుమ్మివడిలో నడలనేర్చుచు
సుడుల తరగల బెడగువలపుల
జడిమతో తెగ పలువరించెడి
కదలివెలదికి తెరవులరసెడి

రూపగుణ విలసన్మహోత్సవ
రుచిరబింబము కౌముదీప్రభ

# మధుమాసము

వకుళ మల్లీ
ముకుళ సుమముల
ధరణి క్రొత్తం
దనము వలచెను

క్రొన్ననల జిగి
వన్నె సొగసుల
పున్నెమై విరి
కన్నె కులికెను

నిగు కెంపుల
సిగ్గు దొంతర
మొగ్గలామని
యగ్గలించెను

అడవి మోదుగ
ఎడద ఎర్రని
పూలగుత్తుల
మాల లూగెను

పల్లవారుణ
పత్రజాలము
తెల్లదిక్కుల
పల్లవించెను

మృదుల కోకిల
మధుర సాలము
ప్రసవ భరముల
వసుధ వాలెను

తరుల శాఖల
దాగుపక్షుల
కలరవమ్ముల
దిశలు ఒప్పెను

మధు ప్రవాహో-
న్మత్త బంభర
నృత్యగానా
నందమొసగెను

లలితమంజుల
లతలు రసభర
ఫలముల వసీ
తలము నిండెను

మధుర మధుధా-
రా స్రవంతులు
మహానివిప్పలి
పొంగు చుండెను

కాలపురుషుని
ఖేల నమ్ముల
రీల లామని
నోల లాడెను

లోక మోహన
శ్రీకర మైత్ర
నవసుందరమ్మ
ఏగు దెంచెను

20 2-1961

# చైత్ర సుందరి

వలపు తలపుల వల్లి కాంతి
పుల్కరించగ పుడమి దెసలను
చైత్రసుందరి చాతురీ ఝరుల
చిత్రములవలె విప్పులొత్తెను

పూలతేనెల జాలులో నవ
భావనాంకుర పారవశ్యము
కన్ను గ్రేవల దిలుకొనగ నను
సిగ్గు దొంతర మొగ్గ దొడిగెను

అధరముపై మధుర హాసము
కదలి యౌవనగరిమ చాటగ
మాధవునిగని మంజులాకృతి
మోవిరుచులను నూలుకొల్పెను

కొమ్మకోయిల కుహూకుహూరుత
గళములో మధుగాన వాహిని
తనదు ప్రాయపుగొనబు దెల్పగ
తరుణి చైత్రిమ తరలివచ్చెను

26 2-1974

# వలపు పిలుపు

తెలిమబ్బు తెరలలో
కులికెడి సోమా !
వెలికిరా రావోయి
ఓ చందమామా

చుక్కవలతికి మమత
చిక్కనై నది యేమొ ?
మక్కువతో నినుదలచి
సొక్కుచున్నది లోన

చిక్కనటు తిక్కలకు
దక్కినటు నటియించి
ఒక్కపరి మొయిలు గమి
నక్కుచున్నావేల ?

నీపైన తమిమిగుల
నిల్పినవి జక్కవలు
కనుచాటు పడినీవు
కలత పెట్టెదవేల ?

చెలిదలచి మదిసొలసి
కలగుండు పడిపిలిచి
ఎలుగులందున చింది
తెలుపుకొంటున్నాయి

పరువంపు సునుసిగ్గు
తెరమరుగు దొరసాని
కలువకన్నియ వలపు
తలపుగను గొనలేదా ?

చదల నిసుగనరేక
ఎద వసట పొదలుకొన
కిరగు కన్నీరంత
కాసారమై నిలా

తావులన్ని వెలుగు
ప్రోవులై పులకింప
వంతలన్నీ తొలగి
వింత సొగసులునింప

రావోయి రావోయి
రా చందమామా !

12-3-1964

# ఉత్పల చరిత

వంశీరవ సుధారసం

వశం వదిమురా సఖా!

మందర ధర సుందరాకార

మమత నిలువకున్నదిరా

నెలరాజును గూడికలువ

నెమ్మికులుకుచున్నదిరా!

సరస నీవెవని ఎక

సక్కెమాడుచున్నదిర!

వలపురేని చెలిమి దొరగి

వనము చిన్నవోయెనురా!

ఒంటిరి ననుజూచి యమున

కంటనీరు దొరలెనుర!

పద్మాలయ హృదయాధిప

పదములనే నమ్మితిర!

రక్తిలోల భక్తపాల

శక్తిలేని దాననురా!

యువతి గణమనోవిజయ

కామితార్థ కల్పద్రుమ !

మురళీధర మధురాధర

కరుణాకర మొరవినర !

సిరిపతి నను విడగింపక

దరిచేర్చగ రమ్మురా ।

మనసులోని ఆమితీరంగ

మధురగీతి పల్కించర !

గానామృతరస ధునిలో

రేణువగుచు తేలుదుర

రారా నా మాధవా ? !

ప్రణయ రాజ్యరమాధవా ? ।

12 7 1962

# జాతి సంపద

మనసు మల్లెల మంచితావుల
మందహాసము చిందులాడే
పల్కులందున భావసంపద
పరవశమ్మున వ్యక్తపరచే

పాలబుగ్గల పసిడినిగ్గులు
సంతసంబుల జాలిమొగ్గలు

లోకమందలి చీకుచింతల
బాకుపోటుల తాకులెరుగని
కన్నుగొలుకుల కాంతివెన్నెల
కమ్మసోనల గ్రుమ్మరించే

పసదనమ్ముల మిసిమిముద్దలు
బాలవీరులు పూలతేరులు

అమ్మఒడిలో చదువుబడిలో
ఆటపాటల నలరించే
మాయమర్మపు ఛాయతెలుగని
తీయ రసముల తేనెవాకలు

నవ్య రాగానంద రూపులు
చిద్విలాసులు చిన్నిపాపలు

28-11-1963

# ఉగాది

ఈ యుగాదికి తెలుగు
లుప్పొంగుతున్నారు
వభావముల మధువు
లాని వికసించాలి

జిలుగు పలుకుల మేలి
వెలుగులను గన్నారు
ముందు తరముల సుఖము
లందె మసుంచాలి

తల్లి వాకకు ఋణము
చెల్లించుసున్నారు
అనురాగ బలముతో
ఐక్యమై కదిలాలి

వేగిరముగా ముందు
కేగ తలకొన్నారు
కలయిక ల మనికిరో
గెల బలముగన్నారు

చైతన్య పరిపూర్ణ
జాగృతిని వలచారు
శరదిందు వదనులై
వరము గదియించారు

నిజము యిది తెలుగమ్మ
పుత్రోత్సవము సుమ్మ
అవును యిది తెలుగింటి
ఆంధ్రయిుల కాడి !

# ఆ వా హ న

రా రండి రారండి !
రండి సోదరులార !

తెలుగింటి దోరముల
దివ్య తోరణమాల
వ్రేలాడ సంఘటిత
వెలుగులే పారాడ

అకలంక స్నేహాళి
యజరామరముగాగ
మమకారముల ద్రుమము
మందారములు పూయ

మరులుగొను హృదయాల
మాధుర్యములు పంచ
జనని కన్నులకాంతి
చైత్రరూపము నిండ

పాడిపంటల కలిమి
పరిశ్రమలలో బలిమి
భావితరముల మేలు
బంతులై భాసింప

శుభకామనల జగతి
సురుచిరమౌ ప్రగతి
జనలక్ష్యమై వెలయ
జయనాదములు విరియ

రారండి రారండి!
రండి సోదరులారా!

# చిన్నారికి

చిన్నారి పొన్నారి చిట్టిపాపాయి!
ఏమి చేస్తున్నావు ఎరిగింపవోయి!
ఆటలేమీయిపుడు ఆడుచున్నావు
పాటలేమి నీవు పాడుచున్నావు ?

పదములను చిరునోట పలుకుచున్నావ ?
చదువులో గడితేరి ఫలమందేవ ?
ఆగడము చేస్తేను అల్లరంటారు
అమ్మాయి నీతోడ ఆడుకోరాయి

మంచిగా నీవుంటె మెచ్చుకొంటారు
అనురాగమాలవని ఆదరిస్తారు
అందుకే వ్రాశాను అందుకోలేఖ!
మామయ్యమాటలను మరచిపోబోక

పంపుచున్నానిందు నింపముద్దులను
పంచుకొండీతోటి బాలలందరును
ఇంతటితో యీలేఖ నిలుపుచున్నాను
వీలుచూచుక మళ్ళి వ్రాసపంపేను

